# అమరావతిమాహాత్మ్యము.

ఇది

గుంటూరు మండలములోని కుమ్మరపూడినివాసియగు

మల్లాది అనంతరామయ్యచే

రచియింపబడియె.

500 ప్రతులు.

కే. బి. క్రిష్ణారావుచే

గుం[illegible]రు వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1914.

వెల రు 0-1-0.



# పీఠిక.

ఆర్యులారా, మీయందరికొక విన్నపంబు విన్నవించుకొనుచున్నవాఁడ. అదియేమన నేసాధుఁడను గణయతిప్రాస లక్షణంబు తెలియఁగను. నేను కోరికతో రచియించిన యీ చిన్నపొత్తమునందలి తప్పులమన్నించి యొప్పుల గ్రహింప వేఁడుచున్నవాఁడ.

ఇట్లు విధేయుఁడు,

మల్లాది అనంతరామయ్య.

శ్రీ ర స్తు.

# అమరావతి మాహాత్మ్యము.

క॥ శ్రీరామ దశరథాత్మజ
కారుణ్యా నిఖిలరక్షకా హారవినుతా
ధీరరణశూరకరుణను
రారా నను బ్రోవవేగ రఘుకులతిలకా॥

( గణపతి ప్రార్థన )

గీ॥ శ్రీవినాయక పార్వతీ చిన్నికుఱ్ఱ
ఏకదంతుఁడ నినుభువి నెల్లప్రజలు
మొదలఁదలఁచెదరే కార్యమునకు, మేలు
గలుఁగ మ్రొక్కెద ననుఁగృపఁ గావుమయ్య॥

ఘనచింత నొందుచుంటిని
వినియెద నొక సుకథఁ జెప్పవే ముద మొదవన్॥

వ॥ అనిన నమ్మునీంద్రుఁడు సంతసించి నీ వేకథవినఁదలంచితివని యడుగ
నారాజేంద్రుం డిట్లనియె॥

క॥ ధర నమరావతియను న
ప్పురమున కా నామమెటుల బుట్టెను హరుఁడా
పురి వెలయుటకేకారణ
మెరిగింపవె పుణ్యచరిత యీనమయమునన్॥

క॥ అనియడిగిన నరవరునకు
మునివరుఁడిట్లనియె పాండుపుత్రా వినుమా
ఘనచరితము రసభరితము
విన దురితములెల్లఁ బాయు వినుపింతునికన్॥

క॥ ధారుణి మున్నొక దనుజుఁడు
తారకనాముఁడు ఘోరతప మొనరింపన్
వారిజగర్భుఁడు మెచ్చి యు
దారత వరములనొసంగ దయ నేతెంచెన్॥

సీ॥ ఇటులఁ జనుదెంచినట్టి వాణీశుఁగాంచి
తారకుఁడు సంతసించి "విధాత! యమర
యక్ష గంధర్వ విద్యాధరాదులందు
నాకు జయమొంద వరమిమ్ము నంగ నలువ॥

క॥ బాలుండొక్కఁడు దప్పఁగ
నేలోకమునందునైన నెవ్వనినైనన్
లీలనుజయింపఁగలవు ను
శీలుడవై యుండుమిలను చిరకాలంబున్॥

సీ॥ ధాత్రికే నెంచి సేఘనతపమునకును
మెచ్చి నీకోరువరము నేనిచ్చితిపుడు
గాన మిక్కిలిసత్కీర్తిఁ గాంచుచుండు
మధికసుఖస్థై వెలిఁగద వసురనాథ॥

వ॥ అని యిట్టుల వరంబులిడి విరించి తనలోకంబునకేగ నని చెప్పి ముని
వరుండిట్లనియె॥

ఉ॥ అంతటఁ దారకుండుచని న్యాయమువీడి సురేంద్రువీటిలో
వంతలఁబెట్ట దేవతులు వానికిజాఁకుచునుండ నాశచీ
కాంతుఁడుబారి యొక్క నుమగిర్భమునందునడాగియుండె, భూ
కాంతవరేణ్య, రాతసు మొగంబునుజూడ భయంబు [illegible]న్॥

వ॥ అనిన ధర్మజుండిట్లనియె॥

క॥ మునిచంద్ర క్రూరుఁడగు నా
దనుజానిద్రుంపఁగ వజ్రి ధైర్యము లేకన్
జనియోవని చెప్పినాఁడవు
ఘనబలుఁడింద్రుండు వెరువఁగాఁబనియేలా॥

వ॥ అనిన మునీంద్రుండిట్లనియె॥

గీ॥ దనుజకంఠమునను బర్వతంబుకరణి
వ్రేలు నొకలింగము జనులు వెరపుజెంద
నతని ప్రాణంబు లా లింగమందుఁగలవ
టంచు నేరును దెలియలేరైరి భువిని॥

గీ॥ అందుచేతన సురలోకమంత తనకు
వశముగావించుకొని దేవవైరిబాధ

బెట్టుచుండఁగ నింద్రుండు వీఁకఁడయ్యెఁ
బారిపుప్పంబులోఁ దాగవలసె నధిప॥

వ॥ అప్పుడు దేవతులు తమ మనంబున॥

ఉ॥ ఎంతటియాపదల్ గలిఁగె నింద్రునివీటికి నిట్టివేళ నీ
యంతకునిన్ వధింప మనమందరమైననుఁ జాలమంచు శ్రీ
కాంతుని వేఁడుచున్ గరళకంఠునినమ్ముచు ధాతనెంచి వా
రంతటఁబోవ నెంచిరి సురాధిపుఁడైన విరించివీటికిన్॥

క॥ సురలంత ధాత చెంతకు
నరిగి దనుజు క్రూరకృత్యమంతయు నుడువన్
సరసిజగర్భుఁడు మొరవిని
సురలకునిట్లనియె ప్రేమఁజూపుచును మదిన్॥

మ॥ వెరవున్ వీఁడిదె వేల్పులార వినుఁడీ వేగంబునం దారకా
సురునిం జంపఁగలారు లేఁడు ధరపైఁ జూడంగ మీ రేఁగి శ్రీ
హరునిన్ వేఁడుఁడి భక్తితోడ నటఁ గార్యంబెల్ల సిద్ధించు దు
ష్చరితుండెల్లఁ శుభంబుగల్గుఁ జనుఁడీ శంకింపమీ కేటికిన్॥

క॥ అనిమునువు నలువ పలుకులు
విని వేల్పులు గొంత చింత విడి శివనిలయం
బున కేగుచుఁ దమమదిని
ట్లనుచు వితర్కింపఁ జొచ్చి రవనీనాథా॥

చ॥ అరుఁగుచునుంటిమచ్చటికి నాపరమేశుఁడు గోపగించునో
కరుణను బ్రోచునో గరళకంఠుఁడు క్రూరులమంచుఁ బల్కునో,
పురహరుఁ డేలఁ బల్కు దయఁ బ్రోచును, బ్రోవక యొగ్గు సేయునే
హరుఁడు కృపారసాబ్ధి మనయందొకయించుక ప్రేమఁ జూపఁడే॥

వ॥ ఇట్టులఁ దమమనంబున వితర్కించుకొనుచుఁ గుబేరుని పట్టణంబుఁ
గడచి॥

క॥ సురలపుష్కరిణి హరుకా
పురమును ఘనదురితహరము మునిజనవరసం
భరితము చింతాహరమున్
సురపురిక్రియ వెలుగుచుండు శూలిపురంబున్॥

గీ॥ కనియె బిమ్మట దేవతాగణము వెండి
పర్వతంబున నివసించు సర్వమయుని
చంద్రచూడుని హరుని భుజంగధరుని
సాధుజనపోషబిరుదుని సాంబశివుని॥

గీ! మూడుకన్నులుగలవాని భూతపతిని
కాయమెల్లవిభూతిని బూయువాని

స్త్రీయో పురుషుండో రెండునుఁ దెలియకుండ
నున్నవానిని గాలిలో నున్నవాని॥

ఉ॥ కుక్షికి లేనివారలకుఁ గోరినసంపదలిచ్చు మేటినిన్
భిక్షము నెత్తువానినిఁ గుబేరుని మిత్రుని సర్వలోకముల్
రక్షణసేయువానిని దురాత్ములఁ బట్టి వధించువాని ఫా
లాక్షుని జేరి మ్రొక్కి సురలంతనుతించిరి భక్తి తోడుతన్॥

క॥ ధాతవయి సృష్టిచేసెదు
భూతలమున జంతుకోటిఁ బ్రోచెదు హరివై
భూతేశుడవై లయము
చేతువు మమ్ము నృపు రక్షసేయఁగ లేవే॥

క॥ హార మున్ను మేము వేడఁగ
ంగరళానలబాధ మాన్పి కాపాడవె నిన్

మరువక దలంచుచుందుము
కరుణాపూరతింపు నీలకంధరమమ్మున్॥

క॥ తారకుఁడను నొకదనుజుఁడు
క్రూరుఁడు మాపురముఁజొచ్చి గొబ్బుననింద్రుం
బారఁగఁ జేసెను మము ని
ష్కారణముగ బాధనొంచెఁ గనవెదురాత్మున్॥

క॥ దేవా యీకార్యమునకు
నీవే యాధారమనుచు నీరజగర్భుం
డావంతఁ దెల్పవచ్చితి
మీవేశా పాడవలయు నీసమయమునన్॥

వ॥ సురలివ్విధమున మొదలిడఁ గరుణాసముద్రుండైన హరుండు భయం
బుడిపిషొండని యానతిచ్చెఁ. తదనంతరంబఁ దనభార్యయగు భార్వ

తింగూడి రతిం దేలుసమయంబున విరోధియగు మన్మథుండు సంగ్రామం
బుఁ బుట్టింపమిం జేసి శివునకు వీర్యపతనంబుగామిఁ బార్వతి వేసరి రో
షించి దేవతలచే నిట్లయ్యెనని యెంచి యా దేవతాసంఘంబునకు శా
పంబిచ్చెదవన,

ఉ॥ కుందుచునంతరంబున ముకుందుని వీక్షింబోయి దేవతా
బృందముఖ్యక్షితోడను విభీషణుపోషకుఁ జేరి మ్రొక్కి గో
వింద హరీ మురారియని వేడుచు గల్గిన బాధఁ దెల్ప నా
నందనిమగ్నుఁడై హరి సంతసమొంది కుమారునిట్లనున్॥

వ॥ మన్మథా యచట శివుండు మోహంబు లేకున్నవాఁడు. అతనికి మో
హంబుగల్పించి పార్వతీశాపంబు వారినుండి దేవతల రక్షింపుమనిన
మదనుండిట్లనియె॥

క॥ హరి! నీయాజ్ఞను జనుటకు
వెఱవను నామనవినొకటి వినునేనేగన్
హరుఁడు దనకోపవహ్నినిఁ
బరిమార్చును నన్నుఁ దనదు పగతుఁడనగుటన్॥

వ॥ తండ్రీ! నేను నీవుచెప్పినట్లు శివునికి మోహంబుఁగల్పింపనేగి యచట మడసెద నందుచే నిన్ను విడచి నీపాదసేవ మానవలసివచ్చుఁ గాన నే కైలాసంబునకుఁ బోనొల్లననిన వాసుదేవుండిట్లనియె॥

క॥ నందన మృతిఁ జెందెదనని
కుందగనీకేల ముందు గొమరుడవై నా
యందున జననంబొందెదు
కందర్పుఁడపొమ్ము సురలఁ గాచుటకొఱకై॥

క॥ అనిహారి చెప్పిన మదనుఁడు
విని కైలాసమునకేఁగి విరిశరములచే
ఘనబాధయందుముంచ శి
వునికనుపమ మోహామపుడు బుట్టెన ఖేంద్రా॥

వ॥ శివునికి వీర్యంబుద్భవించి పార్వతిగర్భంబుఁ జొరఁబోవుసమయమున॥

చ॥ హరుసతులంతఁ బండ దమకంబరవీధినినిల్చి శూరుడై
శరములు వేయుమన్మథుని శాంభవికన్నులఁజూచి సిగ్గునం
బురుషుఁడాకంమువచ్చెనని భోల్లున కేకను వేయ కోపియై
హరుడువధించె గామునయనానలకీలలఁ గాల్చి భూవరా॥

వ॥ అప్పుడా వీర్యంబు యు కస్థానంబునంబడక గుప్పుగుప్పుమని చప్పు
ములు నెడల ననలంబుభంగి వెలుంగుచు భూతలంబునఁ బారెనంత॥

ఉ॥ కాంతుమ్రమగ్గినంచు రతి గన్నులఁదోయకణంబులొల్కఁగా
జింతిలుచుండి పోయి హరుచెంతనుఁజేరి నమస్కరించి ని
న్నంతరమందు మారుకు హరాయని వేడుచునుండునట్టి నా
కాంతునిఁ జంపగాఁదగునె కారుణసాంద్రుఁడ హా మహేశ్వరా॥

క॥ ధారుణిలో ప్రాణులకుం
దీరనిమోహంబునిచ్చు ధీరుండును స
త్పూరుషుఁడు నాదుపెనిమిటి
నీరీతివధింప న్యాయమేనికు శివా॥

వ॥ అని రతీదేవి పతిభిక్షంబుఁబెట్టుమని వేడిన హరుండు కరుణించి యి
ట్లనియె॥

చ॥ పెనిమిటిమ్రగ్గినంచు మదిఁబెల్లుగ దుఃఖమునొందకీవు నీ
మనమున నెన్నునాఁడపుడె మారుఁడుచెంతకువచ్చు నీకథం

గనుగొనిపోవుచుండును సుఖంబుగనుండుమటంచుఁ దెల్పగా
జనియెదనంచు సాధ్వి రతి శంభునివీడి ముదంబునం జనెన్॥

వ॥ అంత ఋషిమండలంబున సప్తమహాఋషులభార్యలైన యరుంధతి మొదలుగాఁగల యేడ్వురంగనలు చెంగున గంగకుంజని యుదకంబుఁదెత్తుమని హృదయంబున ముదంబునొందిపోవుచు॥

క॥ చెంగునకనిరి ఋషిసతులు
పొంగుచు ఘోరనుచుపారు పురహరుజటలో
సంగనఁ బాపవిభంగన్
నింగికెగయు నలలతోడ నిండినగంగన్॥

గీ॥ అంత నదికేగి యచ్చట నాపడతులు
'నీరుగొంపోవకుండయె నిలచియచట

వెతలుచుండిన శంభుని వీర్యముదెప
జూచుచుండిరయాశచీ సుదతిదక్క॥

వ॥ నరేంద్రా! యరుంధతి యేకార్యంబైనఁ బరికించి చేయుచుండును
గాన నక్కాంతామణి వారికెఱిగింతు వివనందున వచ్చిన కార్యంబు
గావించుకొని తిరిగి తన నెలవునకుం జనియె నంత నిచ్చట॥

గీ॥ చూడరేమీరు చెలులార చోద్యముగను
యరుఁగుచున్నది మూదు దావాగ్ని చూడఁ
దపనుఁడో లేక చంద్రుఁడో దహనుఁడో యన
వెలుఁగుచున్నది కనులకు వేడ్కపాదమ॥

వ॥ యివ్విధంబున నవ్వనితలు మనంబున నబ్బురపడుచు నదియునుంగా
క నాసమయంబుదయంబుగావున చలిచే గడగడవడంకుచు॥

ఉ॥ కాంతలు వేఁగఁబోయి చలిఁగాచుక వత్తుమటంచు జేలతై
చెంతకుఁదోయి వీర్యమునుఁ జేతులఁజాచుచు కౌఁగలింప నా
యింతుల గర్భభాగమున కీశ్వరునింద్రియ మేఁగ నవ్విధా
కాంతలు గర్భధారణముగాఁగఁ గుమారులఁగాంచి రార్యరున్॥

వ॥ అంత నామగువలు దామ జారిణులను నిందపాలగుదుమని వెఱప్రు
న దమబిడ్డల నచటఁబారవైచి నదీతీరంబున కేగి యెప్పటియట్ల నీ
రంబుగొంటకై యునికతోఁ బాత్రలఁనిర్మింపఁబోవుతఱి వారిపాతి
వ్రత్యంబు భంగంబగుటచే నాయువుక ఘటరూపంబు దాల్చదయ్యె.
అందులకా కాంతలు చింతిల్లి తమనిలయంబులకుఁ జలంబు లేక యే
పోయిరి. అట్లువచ్చినవారిం గని వారిభర్తలు కోపించి॥

ఉ॥ నీరముఁదెత్తుమంచుఁజని నీరొకయింతయు లేక యిట్లు రాఁ
గారణమేమొ తెల్పుఁడనఁగా సతులూరకయుండ. నావదీ

తీరమునందుచన్న విధి తెల్లముగా దమదివ్యచక్షుచే
వారలుగాంచి యంత నిజభార్యలవీడిరి కోపదృష్టితోన్॥

క॥ ఆకాంతలు భర్తలచే
వాకిలివెడలంగ గొట్టఁబడి యుండుటచే
శోకంబునొందుచుం జని
యాకసమునవిలచిరప్పు డవనీనాథా॥

వ॥ అంత గంగానదీతీరంబునఁ బిల్లలను మార్గవశంబునఁగాంచి యఖి
లలోకసంచారుండగు నారదుండు॥

సీ॥ ఈబాలకులతల్లులెవ్వరో యీబాలు రీయడవినినిటు లేడ్వనేల
నో బ్రాహ్మణులో క్షత్రియులో వైశ్యులో శూద్రులో వీరికులమె
ద్దియో యెఱుంగ। గన్నతల్లికినిట్లుఁ గల్గునే కఠినంబు బాలురనీరీతిఁ
బారవేయ। ననుచువీరలనేరి కైననిచ్చెదనంచు నెత్తుకపోనెంచియే

కదుమగను॥ గీ॥ కాగిటం జేర్చ శిశువుల కాయముతోఁ। బొకటికల
సి తలలుఁ జేతులున్నయట్టి యుండి యారుతలలును బన్నెండుకే
తు। లున్న యొకబాలుఁడేర్పడెనో మహీశ॥

వ॥ అంతనబ్బాలుండుగ్రుండై కనులగ్నికణంబులభాతివెలుంగఁ దన్ను బట్టుకొనియున్న తాపసిఁగాంచి నీవెవ్వఁడవనియడుగ నారదుండి ట్లాఱ్వురుశిశువులు నొక్కబాలుఁడగుటకును మఱియు నబ్బాలుం డుగ్రుండై మాటలాడఁగలుగుటకును నబ్బురమంది తన్నుం జంపునేమోయని భయంబుఁగూడఁగలుగ నంతటిబాలుం డీశ్వరపుత్రుండై యుండనోపునని తన దివ్యదృష్టిచేగనుంగొని॥

ఉ॥ హారసుత నన్ను నారదుఁడండురు లోకులు సర్వలోకసం
చరుఁడను। బహ్మపుత్రుఁడను శంభుపురంబునకేఁగుచుంటినం

చెఱఁగఁగవిన్నవించి గిరిజేశ్వరుపుత్రుఁ నుతించి వేగఁ దా
నరిగెను నారదుండును త్రిపురాంతకుపీఠికి సమ్ముదంబునన్॥

వ॥ అట్లేఁగి యానలువపట్టి శివునకు జరిగినవృత్తంబెల్ల నెఱింగింప శి
వుండు సంతసించి తనకుమారుఁడగు గుమారుని సన్నిధానంబునకే
తెంచి సుతునిముద్దాడి కాని కోపోద్రేకుండగు నబ్బాలుండుఁ దం
డ్రి సరసంబులచే సంతసింపక జాగిలినమస్కరించె॥

గీ॥ అట్లు దండంబు నీశ్వరు కాచరించి
యేల ననుఁబుట్టఁజేసితి వెఱుఁగఁజెప్పు
వలయుకార్యంబుసాధింపఁ గలను నాదు
తండ్రి! యాపనిదెల్పుమ తక్షణమున॥

వ॥ అనిన శంభుండిట్లనియె॥

మ॥ ధరిత్రిలోన దైత్యుఁడైన దారకుండు వీరుఁడై
సురేంద్రుపీటిలోన వేగఁ జొచ్చి బాధ బెట్టుచున్
ధరిత్రిఁదన్ను నెవ్వడేనఁ దాక లేడఁటంచుఁదా
దురాత్ముఁడై నటోపు మాడెఁ ద్రుంచి రమ్ము వృత్రకా॥

వ॥ అని యివ్విధంబున నెఱింగించు॥

క॥ అడుగడుగునకును లోకము
గడగడవడకాగ ధ్వనులు గగనము నెగయన్
వడివడిగా నడచుచుఁదా
వెడలి హరునిసుతుఁడు సురలవీటిం జేరన్॥

వ॥ యిట్లువిని తారకాసురుని నెలవుకుం జనుచుండఁ దారకుండాతని పాదములచప్పుడులువిని యబ్బురమొంది గొబ్బున లేచివచ్చి కుమారునింగాంచి కన్నుల నిప్పులు కుప్పలుఁ రాల నాతనితో నిట్లనియె॥

మ॥ వెరవుం జెందక వచ్చెదీవెవఁడవో వీరుండ వన్గల్వా నీ
తరమే పోరఁగవజ్రియున్ భయముఁజెందఁగ నీకుశక్యంబె నా
శరముష్టిన్ నిన్నుఁగూల్తు నీమశిరముల్ ఖండించెదన్ జూడు నా
శరమై పోయెదు తెల్విఁదెచ్చుకొని పొమ్మా వేగనీవిటకున్॥

క॥ నామహిమ నాబలము నా
సామర్థ్యమునెఱుఁగనట్టి జనుఁడునె యీ
భూమండలమధ్యంబున
నేమాత్రపువాఁడవీవు యిటననుగెలువన్॥

వ॥ అనిన కుమారస్వామి యిట్లనియె॥

చ॥ వెరపొక యింతలేక యిటుఁ బ్రేలుచునుండెద వేలమూర్ఖ నీ
గరువమడంతు దేవతనికాయముసంతసిలంగఁ జేతు నీ

పరిజనంబెల్లవచ్చినను బారఁగఁదోలెద శంభుపుత్త్రుఁడం
చెఱుగుమునన్ను నేను వధియించెదఁజూడుము నిన్ రణంబునన్॥

వ॥ మఱియు నిట్లనియె॥

గీ॥ సురవిభుఁడు దేవతలు నినుఁజూచి పాఱి
పోయినట్టుల నేఁబాఱిపోను నిన్ను
కత్తి కోకకంఠగాఁ జీల్చి కాకములుభు
జింపఁ జేసెద నన్ను వంచింపగలవె॥

వ॥ ఇక్కరణి ముక్కంటిసుతునిపలుకులు కా రక్కసుని కోపాగ్ని రెట్టింప
నాతండు దనఘోరతరమగు నొకగదం దీసి కుమారునిపై వైవ, నంత
నాకుమారస్వామి ధనిరుపమానచాతుర్యంబుచే దనపై కతిరయం
బున నేతెంచుచున్న గద ననేకఖండంబులుగా నొనరించె. ఇట్లు ని
ష్ఫలంబైన తనగదం గాంచి తారకుండు యబ్బురమొంది మరల వే

రోకగద నాబాలునిపైపై వ దానింగూడఁ దొల్లింటి క్రియఁగావించి యప్పురారిసుతుం డొక్క శరంబుఁబూని సురారిపైనేసె. ఆరాక్షసుండా బాలుఁడు శరంబులు వేయునే కాని తనప్రాణంబులుండెడు లింగంబుంగూర్చిన మర్మంబు దెలిసికొనలేఁడని లోలోనసంతసించుచు నాతండు వేసిన శరంబుఁ దప్పించుకొని జంకెన మత్త వృషభంబుమాడ్కి అంకెలవైచుచు నాతనిపైకురికి పోరజొచ్చె. ఇట్లిరువురు నిరువదియొక్క దినంబులు ఘోరసంగ్రామంబు గావించిరి. అట్టితరి షణ్ముఖుండు దారకుని ప్రాణమర్మంబు మున్నె తనతండ్రిచే నెఱింగినవాఁడుగావున నొక్క ఘోరశరంబునఁ దారకుని మెడయందలి లింగంబు దుత్తునియలుగావించె॥

క॥ తారకుఁడంతటధరపై
ఘోరంబగుకొండవగిదిఁ గూలి కినుకతో

ధారుణిపడఁ గఁగనరచి కు
మారుని దార్ఢ్యత నుతించి మరణించెన్నృపా॥

క॥ సురలంత సంతసంబునఁ
గురిపించిరి పుష్పవృష్టి గుంభినిమీఁదన్
మొరయుచుఁ బాటలఁ బాడిరి
హరపుత్రునిఁ బూజసలిపి రథికప్రీతిన్॥

వ॥ ఇట్లు కుమారస్వామి సురలచే వేర్వేరువిధంబులఁ బూజింపంబడి యాతనికాసమయంబునుండి కోటికి నిలయంబుగానున్న భీమనది కేతెంచెనని చెప్పిన విని ధర్మజుండు సూతునింజూచి మునివరా! కుమారభగవంతుం డిదివరకే తారకుని ప్రాణంబులా లింగమందుండెనని తెలిసియుఁ జంపుటకన్ని దినంబులు పోరాడుటకుఁ గారణమేమనిన మునీంద్రుండిట్లనియె॥

క॥ ధరణీశ దనుజద్రుమాచఁగ
హరసుతునకు నిమిషమాత్రమగు దనుజబలం
బరయుటకిట్టులఁబోరెను
పరికింపఁగ దనుజుఁడతని బలముకుఁదగునే॥

వ॥ అని వ్రాసియున్నారిమె. ఓ ధర్మరాజా! కుమారస్వామి బాణంబుచే దారకునిలింగంబు తునుకలయ్యెనని యిదివరకే నుడివితిని. ఆ తునకలన్నియు భూలోకంబున నైదుప్రదేశంబులంబడి చూచినప్రజలందరు నాశ్చర్యపడునట్లు వెలుగుచుండె. వానియందొకలింగంబధికంబుగ వెలుఁగుచుండె. అంతనింద్రుండు తన బాధమాన్పిన కుమారస్వామిని నుతించుచు తనపురిపాలించుచు నొకనాడు సుఖాసీనుఁడై భూలోకమున లింగంబు వెలుఁగు విచిత్రంబు దారకునిమహిమావిశేషంబును జాటుచున్నదనియు నాతఁడు ధన్యుఁడనియు ను

తించి యంతమహానుభావుండు దనపురింజచ్చుటచేఁ దనకేమైన పా
పంబువాటిల్లునని భయంపడి యీపాపంబు భూలోకమున నొకచోఁ
బడి పెరుగుచున్న యీశివలింగంబు మాత్రపూర్వకంబుగఁ బ్రతి
ష్ఠించినచోఁ బోవునని నిశ్చయించి తనపరివారంబుతోఁ డను మునిగ
ణంబులతోఁ డను శక్రేంద్రంబు నెక్కి పయనంబై భూలోకంబునకే తెం
చి తన గురువగు బృహస్పతిచే నిర్ణయింపంబడిన యొక శుభలగ్న
మున నాలింగంబును యుక్తంబుగఁ బ్రతిష్ఠించె. పిమ్మట శుక్రుం
డింద్రుంజూచి, ఇంద్రా! ఈప్రదేశంబునఁ గొంతకాలంబునకు గృష్ణ
యను నొకనది యుద్భవించి యీలింగంబు పయింబారుఁ గాన నిది
యీలింగము నుంచుటకు యుక్తస్థలంబుగాదనిన శచీనాథుండు మిన్న
కుండిన వసిష్ఠుండుఁ శుక్రా! అట్లు జంకింపనేల? ఇచట నొకనదియు
ద్భవించునేని యది నావాక్యమహిమావశంబున నీలింగంబు దెసరా

క నొలగిపోవునని చెప్పెను అంత బృహస్పతి యింద్రుంజూచి యిట్లనియె.

సీ॥ అమరేశయీ దేవుం డమరేశ్వరాభిఖ్య నీకు ముందు పేర్వడు నీస్థలమున పట్టణంబొకటి యుద్భవమొందనిచ్చోట బహుజనధనవన భరితమగుచు॥ యమరావతియనంగ నాపురశ్రేష్ఠమీ యమరేశుడనుపేర నలరుచుండు॥ ఈదేవుసన్నిధానమునయందు నిదియొక క్షేత్రరాజంబయి కీర్తిగాంచు॥

గీ॥ రాజశేఖర యీపురి రాజధాని
గాఁగఁ దమరాజ్యముల నేలఁగలరు ధర్మ
వంతులకుఁ బుణ్యులకు భక్తివరుల కాపు
రంబుగాపురమగు సురరాజ రాజ॥

వ॥ అనిన నింద్రుండిట్లనియె॥

గీ॥ ధరణిలోపల నీచరిత్రంబు నెవరు
వినిన జదివినఁ బాపంబు వీడిపోయి
పుణ్యులగుదురు సౌఖ్యముల్ పొంది యుర్వి
వదలి యంతమునఁ జివరకు స్వర్గముగను॥

వ॥ సురనాథుండిట్లానతిచ్చి పరివారంబుతో సురలోకంబున కేగె
ఓధర్మరాజా! తరువాత గొన్ని దినంబులకు శుక్రుండు చెప్పినట్లు కృ
ష్ణానదియు బృహస్పతి చెప్పినట్లమరావతియను నొకపట్టణంబు నుద్భ
వించె. ఆపట్టణవాసులు గొందఱుకలసి యమరేశ్వరుని కొక
యాలయంబుఁ గట్టించిరి. కాని యద్దేవుండు దన్నుఁ బ్రతిష్ఠించిన తరు
వాతఁ గూడ బెలుఁగుచునేయుండుటఁ జేసి కొన్ని నాళ్ళకా యాలయ
ము బ్రద్దలు జేసికొని పైకెగసెను. అంత నాయూరిప్రజ లేమిచేయు
టకుఁదోచకున్నతరి నొకరాత్రి నీయమరేశ్వరుండు వారియందొకని

కి స్వప్నంబున దర్శనంబిచ్చి తానమరేశ్వరుండననియుఁ దనశిరంబున నొకబంగారుపిల్ల గ్రాట్టినఁ వానంతటఁ బెరుగకుండుననియు జెప్పెను. అంతవారందరు నదియొక్కరీతి యట్లు చేసిరి. దానికి దృష్టాంతముగ నచ్చట నిప్పటికి నాపిల్లయు లింగమున రెండువైపులను శిరంబునుండి జారియున్న పాలనెత్తురుధారలును గాన్పించును. ఇక ముందునట్లు గాన్పింపగలవు. ఈ ధారల నాయమరేశ్వరుండు దనప్రభావంబుఁ బ్రజలకుఁజూపి వారుతనయందు భక్తిగలవారై కై జేసె.

గీ॥ అచటఁ బ్రతిశివరాత్రికి హరుని సేవ
జరుగుచుండును మిక్కిలి సంభ్రమముగ
నట్టిసునయాత్రజూడ నాపట్టణమున
కరిగెదరు పెక్కుయాత్రికు లవనినాథ॥

క॥ అచ్చుటసమరేశ్వరునకు
ముచ్చటగా సేవజరుగు మూడుదినంబుల్
అచ్చటిజనములు పిమ్మట
విచ్చేయుదు రాపురంబు వీడి నరేంద్రా॥

వ॥ నరేంద్రా! నేనెరింగినకథనంతయు వినుపించితిని. ఇంక నీవు పుణ్యశీలుండవయ్యెదవు. అదియునుగాక నీమేనమరందియగు శ్రీకృష్ణుని కరుణవలన నీసర్వరాజ్యంబును పొందగలవు.

క॥ అనినుడువు నాతుపలుకుల
విని ధర్మజుఁడుబ్బియపుడు వేమరునాతున్
ఘనుఁడని కొనియాడుచుదాఁ
జనియెను తమ్ములనుగూడి సంతోషముతోన్॥

సంపూర్ణము.

